# ఆంధ్రజ్వాల



జంపన చంద్రశేఖరరావు, ఎం. ఏ., బి. ఇడి.

'నవజీవన సమితి'
అన్నామలై విశ్వవిద్యాలయము
అన్నామలై నగర్



కృతిభర్త:

శ్రీ బి. వి. నారాయణస్వామి నాయుడు,

ఎమ్. ఏ., పి. హెచ్. డి., బి. కాం., బార్-ఎట్-లా.

ప్రొఫెసర్ ఆఫ్ ఎకనమిక్స్ అండ్ ప్రిన్సిపాల్,

పచ్చయప్ప కాలేజి, మద్రాసు.

# DEDICATED

TO

## MY HOPE AND HOMELY - HEART

&

The Luminary Glowing In Dark - Despair

**Rao Saheb Dr. B. V. Narayana Swamy Naidu Garu,**
*M. A., Ph. D., B. Com., Bar-at-law,*

Professor of Economics and Principal of
Pachiappa's College, Madras.

The President, All India Economic Conference.

The Member, Consultative Committee of Economics,
Government of India.

&

The Ardent Lover of Andhra Desh,

The Beacon Light of Trodden Poor.

with

ADMIRATION

&

ADORATION

## కృ త జ్ఞ త

నేనూ మా రామం (సీతారామస్వామి) ప్రాణ స్నేహితులం. నా హృదయదేవాలయంలో తొలుదొలుత ఈ కవితా దీపిక వెలిగించింది వాడే. దాని వెలుగులే ఈ పద్య కిరణాలు.

నేనూ వాడూ మొట్టమొదట 'రామచంద్ర కవులు' అనే పేరుతో జంటకవులుగా కవిత్వం ప్రారంభించాం. కాని మా అడుగులు తడబడ్డాయ్; నడకలు సాగలేదు. మా భావాలు వేరవడంచేత మార్గాలు వేరయి, ఈ సాహితీ ప్రపంచంలో రెండు కవితా స్రవంతులుగా చీలిపోయాం.

నాకీ సాహితీలోకాన్ని పరిచయం చేసిన మా రామం, ఈ పద్యాలను కూడా 'పూర్వార్చి'తో నా ఆంధ్రులకు పరిచయం చేయడం నా భాగ్యం.

దూర దూర తీరాలకు చేరలేక, తీరరాని కోరికలతో వ్యథచెందే నాకు సరళమార్గం చూపి, కవితాభిక్ష పెట్టిన మా రామానికి నా నమస్సులు; నా కృతజ్ఞతాభివందనాలు.

నా వచనరచనలను నేటివరకూ ఆదరించిన నా ఆంధ్రులు, ఈ నా కవితా జగత్తులో కూడా అనురాగ వృష్టి కురిపిస్తారని ఆశిస్తూ, వారికి నా వినయాంజలి సర్పిస్తున్నాను. ఈ కవితాసృష్టికి, ఈ కావ్యప్రచురణకు కారణభూతులైన మా అమ్మా నాన్నలకు నా నమస్సులు.

రచనాకాలం : **1-3-1944**
సలము : అన్నామలైనగరం
అన్నామలై విశ్వవిద్యాలయం.

జంపన చంద్రశేఖరరావు.

# పూర్వార్చిక

ఒక యుగంలో ఒకేభావం ప్రధానస్థానాన్ని ఆక్రమించుకోవడం — వ్యక్తి కృతిలో పృథకత్వము తొల్చడం— ఉపసూక్తుల నుండి భావ గీతాలవరకు, తారా దీపయుగం నుండి విద్యమాన విద్యుద్దీపయుగం వరకు దుస్త్యజంగా గోచరిస్తుంది. అధునాతనయుగంలో స్వాతంత్ర్యేచ్ఛ ఆ ముఖ్యపీఠము నాక్రమించి అంగదేవతలైన అశాంతి, నిస్పృహా, పురాస్మృతులతో సహస్రాక్షు సహస్రపాత్ గా శ్రావితం చిత్రితం అవుతోంది.

శాంతయుగాల్లో నయవిరచన కావ్యాంగముగా స్వీకరింపబడుతుంది. పరైధిత కల్పంలో అది కావ్యభేదముగా పరిచరిత మవుతుంది. అది కారణంగా కాంతాసమ్మితము, ప్రభుసమ్మితమై కావ్యతత్త్వములోనే విప్లవము కనబడుతుంది.

సవ్యకవులు నూటికి 99 పాళ్ళు సంస్కారప్రియులు; మధ్యతరగతివారి అభిరుచులమీద అర్ఘ్యాయిషీ చేయడానికి స్వయంకృత నాయకులున్నా ... ఉపదేశకావ్యము లెప్పుడూ మధ్యశ్రేణిని అధికరించి వ్రాయబడతాయి.

ఈతరగతి కైతలకు 'అలజడి జీవితం; ఆందోళన ఊపిరి; (మధ్యమధ్య) తిరుగుబాటు వేదాంతమునూ.'

నేటి మేటి ఉపదేశకావ్యాల మహాజర్ కి ఇప్పుడే "అంధ్రజ్వాల" ఒకటి చేరింది. రచయిత దృక్పథము ప్రధానంగా సంస్కారంవైపు మొగ్గి ఉండుటచేత రీతి వార్తిక తుంగ

భద్రా ధావనము ననుకరిస్తూ "జలదాంభః కణపాయి తీక్ష్ణ కిరణ జ్వాలా జటాలాగ్నులు — శశిభృన్మౌళి పదాబ్జరేఖల ఫలస్రిక్ ధూపములు" లాంటి సమాసాలు ద్యోతక మౌతున్నాయి. వ్యాయామప్రియుడైన రచయితకు ఈ ఓజోవల్లభత్వము సహజము.

సత్యం యొక్క గంభీరస్వరూప దర్శమునకీ రచయిత చిత్రించిన గీతం చూడండి;—

'ప్రేమ మందిరం
వేశ్యా నృత్యం;
విశ్వ మందిరం
మాయా వేషం.'

ఆదర్శఫలితముగ వెలువడిన దీ తెలుగు బుక్కు.

పురాస్మృతులలో 'హంపీ' రచయితకు మించునది. శ్రీ కొడాలివారివలె నీ కవికూడా 'కరుడుగట్టిన నెత్తుట కాలు మోపి కదల' నేరడు.

నేటి దీనస్థితికి విద్యావిధానము మూలమన్నమాట విద్యార్థులందరూ ఒప్పుకుంటారు. కొండిక దినాలలో young India మత గ్రంథముగా పఠించేవా డీ రచయిత. 'బలిపీఠము' (Educational altar) దాని ఫలితముగా వెలువడిన కావ్య ఖండిక. 'దేశభక్తితో చదువగ రాదె' అన్న శిక్షా సూత్రము రచయిత నిమిత్త మాత్రుడుగా 'కరకల్ప జనాంతరాత్ విధేః' అన్నట్లు తెలుగున గ్రథితమైన మహాత్ముని సందేశ సూక్తి.

కుటీచకు డనదగిన నేటి నిస్సహాయ శ్రామికుని నిజ స్థితిని—

'అన్నపూర్ణమ్మ చేతిలో అతని బ్రతుకె
పాత్రయైనను భిక్షమ్ము పడయ లేదు;'

'వాని యెడదలో పాడైన వీణ కలదు;
లేవు తీగలు; రాగాలు రావు పలుక;
శ్రుతులు చెదరెను; తీయని గతులుమారె;'

'వాని పరిదగ్ధ జీవిత భాజనమున
రుధిరహారతి వెలుగు; రుద్రుడు నటించ
ఆరి పోవును హారతి; ఆరిపోదు
కడుపులో మండు 'ఆకలి' పిడుగుమంట'

అంటూ హృదయం కదలిపోయేటట్లు, రక్తనాళాలు తెగి పోయేటట్లూ వ్రాశా డీ యువకవి. లోతు లందుకోదగిన ఉత్ప్రేక్షాశక్తి వ్యక్తమౌతుంది.

తెలుగుతల్లి దీనస్థితిని వర్ణించేటప్పు డీ రచయిత కలం పదునువారుతుంది—

'కాళ్ళ పారాణి కరగి భూగర్భమందు
కలసి పోయెను నెత్తుటి కాల్వవోలె'

'ఇనుపముళ్ళ పాదాలచే ఎవ్వరొక్కొ—?
నడచు చున్నారు తెనుగుల యెడదలందు'

ఇత్యాది పద్యభాగాలితని ఉద్రిక్త హృదయాన్ని పట్టి చూపెడతాయి. భావానుసరణం, భాష పొందాగా నడుస్తుందప్పుడు.

'బానిస' అనే ఖండికలో మన ఈ స్థితికి కారకులైన పుణ్యాజనులు తెర యీవతలకి రాక తప్పినది కాదు. వైష్ణవ ప్రవృత్తితో దాసత్వమే కోరే నాయకాభాసులు దీన్ని ముఖ్యంగా పఠించాలి. ఈ స్థితినుండి తప్పించుకోవడం ఎల్లా? నశీహత్ అందరికీ తెలిసినదే——

'పోదు దాస్యము స్వార్థము పోకయున్న'

అని ఛాందో బద్ధంగా రచయిత రికార్డు వేశాడు.

* * * *

## అతివాస్తవిక కవిత్వం :

అతివేదనలో కొన్ని అతివాస్తవిక చిత్రాలకు (Surrealistic pictures) ఈ సంపుటి చోటియ్యడం ఓ శుభ లక్షణం.

'ఆకలి కడుపులో అగ్నికిరీటం'
'ఆదిశేషుని వేయి శిరముల
అగ్నిఫేణలు భగ్గుమనవే'

'A plantation of blue daggers
Beneath the opened eyelids in a crowd of leaves.'
Paul Eluard.

'The winged ant is an ear,
tears are the beggars who roll to the bottom of ponds.'
George Hugnet.

'అగ్ని సరస్సున వికసించిన వజ్రం'
శ్రీ శ్రీ

ఇటువంటివి అతివాస్తవిక చిత్రాలకు కొన్ని నిదర్శనాలు.

* * * *

ఇది అనుకరణ యుగమయి పోయినదనే చంద్రశేఖర రావునిర్వేదము గమనించదగినది, అప్రతిహతమగు ఆయుగ ప్రభావముచేతనే కాబోలు—ఆచార్య రాయప్రోలు వారి నుండి కామ్రేడ్ శ్రీ శ్రీ వరకు గల ప్రముఖులరీతు లిందు నీడ గట్టినవి......'ఆంధ్రావళి', 'ఆంధ్రప్రశస్తి' 'హంపీ క్షేత్రము' మొదలగు గ్రంథములవలె 'ఆంధ్రజ్వాల' కూడా ఆంధ్రుల ఆదరాభిమానముల నరయగలదని ఆశిస్తున్నాను.

దేశపు గుండెలో పాకుడు పట్టిన కుళ్ళును కడిగివేయడమే ఇతని ప్రధాన కర్తవ్యం. ఉడుకు రక్తంతో, ఉప్పొంగే హృదయంతో, నిదురపోయే ఆంధ్రయువకులను, మేలుకొల్పి స్వాతంత్ర్య ప్రపంచములోనికి నడిపించుకు పోవడమే ఇతని ప్రధాన ఆశయం.

చంద్రశేఖరరావు ప్రథమంలో పద్య రచయితే. ఐతే కాలమూ అదృష్టమూ అతన్ని వచనరచయితగా కూర్చోపెట్టి తెర ఎత్తించాయి. వచన రచనలలో ఇతడు అంతర్జాతీయాంధ్ర రచయిత కావడం ముదావహమే గాక తెలుగులకు గర్వకారణము కూడాను.

తెలుగు పత్రికా లోకంలో సాహిత్య వాతావరణం ఇంకా ఉండదగిన పరిణతస్థితిలో లేదు. భాగవతాది గ్రంథాలు చదవకుండా, వానిని ముట్టుకోనే పరవశులయ్యే శిష్టులు ఇంకా గుంపులు గుంపులుగానే కనిపిస్తున్నారు. ఇలాటి వాళ్ళ అధికారానికి లొంగిన వాఙ్మయలోకం సంస్కరించాలనే అభిలాషతో సమర్థుడైన ఈ యువకవి ఈ కావ్యసంపుటితో ముందంజ వేస్తున్నాడు.

అదిగో అభిముఖంగా వచ్చే ఋతురాజు. పుంస్కోకిల కూజితాలు ఆశీస్సులుగా వినిపించడం లేదూ?

'కుహూ! కుహూ! కుహూ!'
హర్షించండి! హర్షించండి!

స్వభాను ఫాల్గుణ శుద్ధ పంచమి
విశాఖపురి } దిగుమర్తి సీతారామస్వామి.

# పెంపు పలుకు

చంద్రశేఖ రాంధ్రరాజ్యాల చాల వెలుగు
వెలుగు రాయల మఱపించు తెలుగు పలుకు
రవిని గాంధిని తలపోయు రమ్యలతిక
దేశవృద్ధికి ముఖ్యోపదేశ బుద్ధి.

ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్,
బెజవాడ.

విద్వాన్. భమిడిపాటి అయ్యప్పశాస్త్రి,
శతావధాని.

# ప్రబోధము

వేద సుధలను పిదికిన ప్రేమ భూమి,
బుద్ధ దేవుని గన్నట్టి పుణ్య భూమి,
భవ్య సంపత్సమేతమా భరత భూమి,
గలదు హృదయమ్ముగా మన 'తెలుగుభూమి'

తెలుగు తల్లుల పాలలో కలదు భక్తి;
తెలుగు మండెడు గుండెలో కలదు రక్తి;
తెలుగుకత్తుల నెత్తుట కలదు శక్తి;
తెలుగు గడ్డపై చచ్చిన కలదు ముక్తి.

నేను తెలుగు వాడను;— తల్లి నేలకొరకు
రాల్చు కన్నీళ్ళె రత్నాల రాసులగును;
నేను తెలుగు వీరుడ; — తల్లి నేలకొరకు
కార్చు రుధిరమ్మె స్వాతంత్ర్య సుధల నొసగు.

తెలుగు మాటలో సత్యమ్ము వెలుగు చుండు;
తెలుగు పాటలో ధర్మమ్ము చెలగు చుండు;
తెలుగు ఆటలో ధైర్యమ్ము కలుగు చుండు;
తెలుగు వా రెంత ధన్య జీవులో కుమార!

పాడి పంటల సుఖియించు భవ్యమాత,
మసృణ మందార మాలతీ మధువు లెల్ల
కొల్ల గొన్నట్టి చల్లని తల్లి నేడు
తిరిప మెత్తునే ఇంటింట దిక్కు లేక?

తల్లి యెద చీల్చి, నెత్తుటి ధారనెల్ల
కొదగు బానిస రాక్షసి క్రోలుచుండ,
పందనై పారిపోదునా? భండనమున
శత్రు వధ చేతునా? తెల్గు శౌర్యమొప్ప.

మండి పోయెడు గుండెలో ఎండిపోవు
బధిర రుధిరమ్ము విజయ విధ్వాన మైన,
తెలుగు వీరుని గుండెపై నిలచి యున్న
ప్రళయ రుద్రుని పాదాలు వణికి పోవె?

తెలుగు తల్లికి స్వాతంత్ర్య తేజమొసగ
హృదయ బలి వేదిపై వెలిగించి నారు
రుధిర హారతి తెల్గు శూరులు; నగార
చాటు మో తండ్రి! దేశ దేశాల వేగ.

కనుల జలజల బాష్పముల్ కార్చుచున్న
తల్లి వదనమ్ము కనలేము; తాళలేము;
కలము ఖడ్గమ్ము పూనెదు కరము లెత్తి
పిలచు చున్నాను రా రమ్ము తెలుగు వీర!

పరుల భిక్షచే బ్రతికెడు ప్రాణి కింక
లేదు కన్నిట విజయార్ధ రేఖ యొకటి;
పోదు దాస్యము స్వార్థము పోవకున్న;
రాదు మోక్షము బానిస రాష్ట్రమందు.

# ప్రాచ్య పౌరుషము

తెలుగు ప్రతాపుని కొలువులో జయభేరి
పలుకదా దిగ్వ్యాప్తి సలుప నేడు?
రాజరాడ్విభుని కొల్వుంగ రా రేలనో
నన్నయాది కవు లానంద గరిమ?
కృష్ణరాయల స్మరియించు తెలుగు భూమి
తలచదా స్వేచ్ఛా పథ మ్మొకింత?
బాల చంద్రుని భుజాస్ఫాలనమ్మున రేగు
పౌరుష వహ్ని ఏ వసుధ డాగె?

పిరికి బిడ్డల చంకను పెట్టి పెంచు
ఆంధ్ర *'బానిసమాత' హృదంతరమ్ము
ఎంత మండెనో! కంట నీళ్ళెన్ని కార్చె
నకట! ఎట్టు లీ జీవచ్ఛవాంధ్రు డెరుగు?

---

* పదుగు రుపయోగించే ఈ ప్రయోగానికి శాస్త్రజ్ఞులు మన్నింతురు గాక!

తెలుగు తల్లులు కాళ్ల దిద్దిన పారాణి
కరిగెనే — కన్నీటి కాల్వయందు?
తెలుగు వీరుని కత్తి తెగిన నెత్తుటి జల్లు
కలిసెనే — గౌతమీ గర్భమందు?
అమరావతీ స్తూప మాంధ్ర శిల్పము దెల్ప
బ్రతికెనే — కృష్ణమ్మ పదములంటి?
ఆంధ్ర విజ్ఞాన దేవాలయ మధ్యాన
ఆరెనే — కర్పూర హారతులిక?

చెరిగె మాతల్లి కుంకుమ చెలిమి బొట్టు;
ఆరె ఆంధ్రుల యెద ప్రతాపాగ్ను లెల్ల;
దాస్య రాక్షసీ! కానిమ్ము తాండవమ్ము
తెనుగు వీరుని గుండెలు కనలు దనుక.

కృష్ణ భూపాలుడేని జన్మించ లేదు
ఆంధ్రుల నెవండు నడుపు జయాభిలాష?
అనుచు ఇంటింట పిరికి పా లమ్మ నేల!
చాలదే ప్రాచ్య పౌరుష. శౌర్య వహ్ని?

కృష్ణరాయ లెచట కత్తి త్రిప్పి నంత
భయద శాత్రవ వ్యూహమ్ము పరుగు లెత్తె
ఆ 'విజయ నగర' పురియం దడుగు లిడుట
ఆంధ్ర భూమాత హృదయాన అడుగు లిడులె.

హృదయ మందొక మూల కృశించుచున్న
ముసలి భావాల దైన్యంపు మూల్గు వినుచు,
శిథిల హంపీ విరూపాక్ష జీర్ణ వేది
కనుల నరమోడ్చి బాష్పముల్ కార్తు నేలో?

శిలకు శిలకును మధ్యగా శిథిలమైన
ఆంధ్ర వీరుల నెత్తురు లలము కొనియె;
కరుడు గట్టిన నెత్తుట కాలు మోపి
కదల గలవోయి! గుండెలు కమిలి పోక!

"చురుకు నెత్తురు లుప్పొంగు బిరుదు మగల
శిరము లిచ్చోట నెత్తుటి బురద యందు
మునిగి పోయి — నే డణువులై పోయె" నంచు
తలచు కొన్నంత...గుండె చెక్కలు విదుర్చు.

ఎదకు ఎదకును గదియించి పద్యమైన
శక్తి లేనట్టి దగ్ధ విషాద జీవి
కార్చు చున్నట్టి కన్నీట కడుగ నేల
అలసి పోయిన శిల్ప విన్యాస రేఖ ?

మండి పోయెడు హృదయమ్ము మండ నిమ్ము,
ఆర్ప బోకుము తమ్ముడా! అశ్రు ధార,
మండి పోయిన గుండెయే యెండి పోయి
ఏ యెడారిగా మారి పోదోయి నేను?

చిదికి పోయిన గుండెలో జేర నేల
ప్రాచ్య పౌరుష గాథా పరిభావ మెల్ల ?
దాస్య రాక్షసి పాదాల తలలు మోపి
వినతు లొనరింతు రేలకో తెనుగు వారు ?

క్షాత్ర తేజమ్ము చల్లారి కఱుడు గట్ట
ఆడ బడుచుల కన్నీటి యోడికలను
బ్రతుకు బరువులు సడలించు పాప మేల,
చావగా రాదె ప్రాచ్య యశమ్ము నిలుప ?

ఆస లెటు లీ దరిద్ర జగమందు
చరించెద రాంధ్రులార ! బా
నిస లయి బిచ్చ మెత్త తగునే
మగవారికి ? రోషహీనులై
పస జెడి ఆంధ్రులే పిరికి పాలను
బిడ్డల పెంచ నేల ? ఆ
శిశువులు పుట్టినంత బలి సేయగ
రాదె దరిద్ర దేవికిఁ ?

▽

## ప్రతిభ

చెరిగి పో వింక తెలుగుల జీర్ణ కథలు—
అవ్వి మా హృదంతరమున అణగి యుండె.

మాదు ప్రాచ్య పౌరుష వహ్ని— మా స్థిరతర
నాగరిక కళా ప్రౌఢి మా నంద గరిమ,
తలచు కొను నప్పు డెల్ల నంతాప వహ్ని
హృదయము కలంచి — గర్వమ్ము పదును కొల్పి—
కను గొలంకుల చివురించి— కంఠ నాళ
ములను పెగిలించి — భీకర మూర్తి జేయు.

పిరికి పాలతో మాతల్లి పెంచ లేదు;
తల్లి యొడి లోన పెరిగెదు తరుణ మందె
పదును కత్తుల రావుడుల్ కదన మందు
తాండ వించుట గన లేదె ధైర్య గరిమ.

*  *  *  *

నడుము బిగియించి మాయమ్మ—
"నాయనా! ఇదిగో—
ఇదే చూరకత్తి; ...
పదిలముగ ధరియించు నీచిరుకరమందు—
ఏది ?
త్రిప్పు మిపుడు —
నాతోడ పోరాడు —
ఇట్లె —
భళిర !!!
త్వత్పదాంకిత మొనరించు దండి మగల
మౌళి వికసిత మాణిక్య మాల లింక"

అనుచు పెంపొందు వారెల్ల చనిరి దివికి,
వారి సంతతి కొక యింత ప్రజ్ఞ లేదె ?

వీర మాతలు పెంచిన పెరుగు ధరణి
గడ్డి పోచకైన "ప్రతిభ" కలదు - కలదు;
అవ్వి కత్తులై — కదనము నరి గళములు
చించి — చెండాడ లేవె యోజించి చూడ ?

## దుర్దశ

తెలుగు తల్లీ!
చలిత వల్లీ!

గౌతమీ గర్భమ్ము
కలయు నెత్తుటి వాగు
కనలు వీరుల బాకు
కరుగు గుండెల మంట,

తలచినంతనె గుండె
తల్లడిల్లును దేవి!
ఆ నదుల రొదలలో
నీ బ్రతుకు సొదలలో.

ఎన్ని కేకలు మరిగెనో!
ఎన్ని బాకులు విరిగెనో!

తెలుగు తల్లీ!
చలిత వల్లీ!

* * *

కాకతీయుల గుండె
రేగు శౌర్యపు వీట,
క్రాగు మంటల రాటు,
నార్పు తురకల పోటు,

కనుల జంటను దులిచి
మనసు వింటను గూర్చి
ఆ గుండె బరువులో
నీ మొండి బ్రతుకులో

ఎన్ని కొండలు విరిగెనో !
ఎన్ని కోటలు నురిగెనో !

తెలుగు తల్లీ !
చరిత వల్లీ !



కృష్ణరాయల కోట
కీర్తి వెల్లువ నీట
కలయు నెత్తుటి బాట
చెరుగు తెలుగుల పాట,

ఇచ్చె బిచ్చపు జోలు,
పుచ్చె శౌర్యపు పాలు,
ఆ పేద గుడిసెలో,
ఆ కునుకు దివ్వెలో,

ఎన్ని తలుపులు విడిసెనో!
ఎన్ని తనువులు మడిసెనో!

తెనుగు తల్లీ!
చలిత వల్లీ!

*  *  *

# దాస్యము

మూతలు వారు నేత్రముల
మూల్గుచు నున్నవి ప్రాణ వాయువుల్:
చేతుల కంద రాక పద సీమల
దాగిన అన్నపూర్ణ వి
ఖ్యాత కరాబ్జ మందు కసగా
బడ దించుక భిక్షు మేని — ఆం
ధ్రా! తరియించు టెట్టులో!
క్షుధా మయ దాస్య కఠోర వీధులన్.

కడుపున రేగు మంటలను కాలె
పురా మలినీ కృతాఘముల్;
తడసిన లాభ మేమిటి? వృథా —
ఉరరీకృత బద్ధ శృంఖలల్
ముడి పడు జీవిత వ్యథల
ముల్గుచు తేలుచు నుందు; కాని చో
గడచునె దేహ యాత్ర
మృదు కార్తిక చంద్ర కళా స్మితాఢ్యమున్!

పాత్రత ర్భాస్వర దివ్య తేజ నిభ
　　శశ్వద్భాగ్య మాంధాత్రులన్
మ్లాతమ్మై, క్షణద క్షుధా క్షుభితమై,
　　క్లాంత వ్యథా భిన్నమై,
చేతో వీధి కలంచు చున్నది;
　　వృథా— జీవించియున్ — చచ్చియు
క్కేతీరే యని యేడ్చు మీ సుతుల
　　యా యీ ఘోష మాలింపరే!

శశిభృన్మౌళి పదాబ్జ రేఖల
　　ఫల సద్ధూప నైవేద్యముల్
ఒసగం జూతురె కాని— తీక్ష్ణ కర
　　ప్రత్యుగ్గామి దావాగ్నులన్
వసి వాళ్వారు దరిద్ర జీవుల
　　క్షుధా బాధల్ శమింపంగలే
కిసిరో! భక్తుల మంచు పొంగెదరు
　　సిగ్గేలాగు లేపోయెనో!

జలదాంభః కణపాయి తీక్ష్ణ కిరణ
జ్వాలా జటాలాగ్నులున్,
ప్రళయాభీల కఠోర సంజ్వలిత
విశ్వాక్రాంత ఫాలాక్ష ని
స్తుల నేత్రోద్ధత కరాళ భీకర
మహాస్ఫూర్త్యగ్ని కీలాచ్ఛటల్
మలినాచ్ఛాదక కృశాంగ విశ్వని
క్షుధా మందాగ్నికిన్ జాలునే ?

# స్వాగతము

పసుపును మోము నందలమి
పాపట దిద్దుచు బొట్టు పెట్టుచున్
మిన మిస లాడు వస్త్రముల
మేన నలంకరణమ్ము చేసి, మా
కుసుమిత "ఆంధ్రదేశ" సుమ కోమలు
లెల్లరు పాట పాడుచున్,
విసరుచు, వెంట రాగ తగవే
ఇటు స్వాగత మీయ కున్నచో!

వెనుకకు జూచె నామె ఒక వేడుక
యైనను కాన రాదు; భూ
వినుతుల మోము లెట్టి నయి
భీత దృగంచల చంచలమ్ములో
గనబడె బాష్పధారలు;
"సుఖమ్మున కాయువు చెల్లె" నన్నటుల్
విన బడి దేవి మానసము
బీటలు వారెను భావి దాస్యమున్

తనదు స్వాతంత్ర్య రథ మెక్కి తరలి రాగ
తలుపులను వైచిరే తెల్గు తల్లి కకట!
నిలువు నిలువెల్ల దహియించి నీఱు కాగ
ద్వార మందున నిలిచె నుత్సాహ ముడిగి.

తల్లి మెడ నున్న ముత్యాల దండ నేడు
కలుషితం బాయె ఉష్ణాశ్రు కణము లందు,
కాళ్ల పారాణి కరగి భూ గర్భ మందు
కలసి పోయెను నెత్తుటి కాల్వ వోలె.

నరన సద్గుణ శాఖా ప్రశాంత ఫలము
దివ్య మధు మాస శోభా ప్రదీప్త పికము
వేద విజ్ఞాన కుసుమ ప్రవిష్ట మధువు
అరయ లేదె స్వాతంత్ర్య దివ్యామృతముస్తం.

* * * *

పచ్చని పైరు కుచ్చెళుల భాసిలు
నాంధ్ర సవిత్రి శోభలన్
నిచ్చలు యజ్ఞ వేదిక ధ్వనించెడు
జీవుల రోదన ధ్వనుల్
చిచ్చులు పెట్టి, కాల్చి, మసి చేసెనె?
దైవమ మాదు తల్లి యిం
కెచ్చటి కేగు? సిగ్గు తెరవే
మలినీ కృతముల్ కదా ప్రభూ!

పసిడి సంజల జలతారు పైట దాల్చి
వీణ వాయించుచున్ వన వీథు లందు
స్వేచ్ఛతో విహరించు మా వీర మాత
నినుప సంకెళ్ళ బంధించి రే? మహాత్మ!

పేదల కదుష్ణ రుధిరమ్ము వీర మాత
కంట కార్చిచ్చు సెల యేళ్ళ కాన నగును;
అవని క్షుద్బాధ రేగు దవానలమ్ము
తల్లి మానస కుహరాగ్ని తాండవించు.

శత సహస్ర పరిమళ శాద్వలాఢ్య
మింక "జయజయ" ధ్వనుల శబ్దించ లేదు;
దేవి స్వాతంత్ర్య రథ మెక్కి తిరుగ రాదు
రమ్య పురవీథు లందు హారతు లివేల?

వెఱ్ఱి యాంధ్రుడా! లెమ్మింక-వేగ పోయి
దేవి పదబద్ధ నిగళమ్ము తెగింపు మయ్య;
మాతృబాష్ప పయోధార మాన్పవయ్య,
అంత నీ విచ్చు హారతు లందు లెమ్ము.

"రాజ రాజ కిరీట విరాజ మాన
భాస్కరాంశు వికాస మీ పాద యుగళి
నిగళ బంధీ కృతం బాయె నే" యటంచు
విడువ వలదమ్మ కన్నీటి వేడి చుక్క.

కాలి పోవును దేవి! నీ పూల చాలు
పాడి పంటలు నశియించి పరు లొసంగు
పిండ దానమ్మె గతి యౌను పేదలకును;
విడువ వలదమ్మ కన్నీటి వేడి చుక్క.

నీదు కన్నీటి ధారలో నీరు గాదె
పార మెఱుగని విశ్వ సంసార శాంతి;
నీవు కన్నెత్తి తిలకింప పోవు నాకొ-
విశ్వ వీథీ విహార సంవేత్ర గరిమ.

దేవి గళమున శోభిల్లు దివ్య మాల
రేకు రేకుల విడ దీసి రేగు టేల?
దండి మగలైన పుత్రులు ధరణి కలుగ
తల్లి గుండియల్ నెత్తుట తడుప నగునె?

ఇనుప ముళ్ళ పాదాలచే ఎవ్వరొకొ-
నడచు చున్నారు తెనుగుల యెడద లందు;
రక్త పంకమ్ము - కాల్జారి - వికృతి బడిన
నవ్వు కుందురె అంధ్రు లా నాటికైన.

పుట్ట తేనియ కానికిడు బోయ వారు,
అడవి పూచాలు పై చెడు నాటవికులు,
గంధ సంభార మొసగెడు కాపు వారు
వేచి యున్నారు తల్లి! నీ వేది కడను,

కనుల తేజముల్ తొలు కంగ కరుణ సించి
పంప రాదమ్మ దీవించి భండనమున,
శాంతి సమరమ్ము చేసి ప్రశాంత విభవ
దివ్య హారతు లొసగరే? దేవి! నీకు

# బానిస

పరువు లేనట్టి కొరగాని బానిసీడు
చావగా లేక బ్రతుకగా సాధ్య పడక
అరుగు చున్నాడు జీవచ్ఛవాంధ్రుడగుచు,
కానరా దతనికి మృత్యు గహ్వారమ్ము.

విషము కన్న చేదైన బానిస తనమ్ము
త్రాగ గల డాతఁ డమృత విధమ్ముగాను;
జగతి స్వాతంత్ర్య సామ్రాజ్య చక్రవర్తు
లరుగు మార్గ మాతని కాను నరక పథము.

ఈ క్షుధా క్రాంతు డెప్పుడైన నేర్చి నంత
కారు కలుషంపు కన్నీటి ధార లందు
ఆరి పోవును స్వేచ్ఛా దురాహవాగ్ని
చెరిగి పోవును పూర్వాంధ్ర జీర్ణ గాథ.

వచ్చు చున్నాడు దాస్య దేవతను గొంచు
పారి పొండింక - బానిస బాట యిద్ది-
నిలువ రాదాతని కనుల నీడ లందు
పసుపు కుంకుమ దాల్చెడు భాగ్య నతులు.

* * *

దేశ కళలపై నిప్పులు పోసి నాడు
దేశ కవితల హృదయమ్ము కోసి నాడు
పరుల యెంగిలి కూటికై కరము చాచి
బానిసత్వము విడలేక బ్రతికి నాడు.

"మాతృ భాషలో మాటాడ మరచి" తంచు
ఆంగ్ల భాషనే సభ నుపన్యాస మిచ్చు
దేశ భక్తులు నీయింట తిరుగు చుండ
తిరిపె మెత్తుట కింకేమి కొరత? తల్లి!

"పాత నీతులె బోధించు 'భారతమ్ము'
పాట భక్తినె వర్ణించు 'భాగవతము'
ఆర్య ధర్మమె తెల్పు 'రామాయణమ్ము';
తెలిసి కొను మూర్ఖు డెవ్వండు కలడ" టంచు
'కీట్సు - షెల్లీల' నెప్పుడు కీర్తి సేయు
'ఆంధ్ర బానిస' కంటెను అధము డెవడు?

పొట్ట కూటికి పరులను పొగడు టేమి,
కట్టు బట్టయు, పెట్టెడు బొట్టు నుండి
అఖిల మనుకరణ మగు నవ్య యుగ మందె
తెలుగు దన మింక మట్టిలో కలియునేమొ!

# స్వ భా ష

తెనుగు స్వభాష యంచును
నుతించి— పఠించిన వాడు
దుఃఖ భాజను డయి —
కూడు గుడ్డలు—
ప్రశాంతియు,
కీర్తియు,
పొందలేక—
తా వెనుకటి శౌర్యసంపద—
కవి ప్రవరాళి ప్రతిజ్ఞ తెల్పుచుఁ —
కనులను ప్రాణముల్ నిలువగా—
పఠియింపడే దాస్య గీతముల్?

# రక్తచందనము

జనన ఘడియలో
ఘంటా రావం!

చావు పుట్టుకల
సంధ్యా రాగం!

విన బడ లేదా
మృత్యు నినాదం!

కన బడ లేదా
రక్త చందనం!

* * *

ప్రేమ మందిరం
వేశ్యా నృత్యం!

విశ్వ మందిరం
మాయా వేషం!

విన బడ లేదా
విభంజన ధ్వని,

కన బడ లేదా
కరాళ మేఘం!

* * *

ఆశా వనిలో
ఆర్త మృదంగం !

ఆకలి కడుపులో
అగ్ని కిరీటం !

విన బడ లేదా
విలయ నినాదం !

కన బడ లేదా
ప్రచండ తేజం !

* * *

# నా దేశం

తెలుగు దేశము నాది;
తెలుగు వీసుడ నేను;
తెలుగు జెండా ఏదిరా?
సోదరా!
తెలుగు జెండా లేదురా!

తెలుగు పాలతో మాతల్లి
ఉగ్గు పోసింది;
తెలుగు పాటల మాతల్లి
నిదుర పుచ్చింది;

తెనుగు తల్లుల పాల
శౌర్యమొలికెడు నాడు,
తెలుగు బిడ్డల శక్తి
దిశలపలికెడు నాడు,

బానిసత్వము మాకు
కలదా?
పారు బోతులు మాలో
కలరా?

* * *

తెలుగు నెత్తురు నాది;
తెలుగు శక్తులు నావి,
తెలుగు జెండా ఏదిరా ?
సోదరా !
తెలుగు జెండా లేదురా।

తెలుగు శౌర్యము నాలో
జీర్ణించి పోయింది:
తెలుగు ధైర్యము నాలో
జీవించి మెరిసింది;

తెలుగు వీరుని కత్తి
తేజ మొలికెడు నాడు,
తెలుగు నెత్తుటి జల్లు
దిశల జిమ్మెడి నాడు,

బానిసత్వము మాకు
కలదా ?
పారు బోతులు మాలో
కలరా ?

* * *

తెలుగు భాషయె నాది;
తెలుగు వేషము నాది?
తెలుగు జెండా ఏదిరా?
సోదరా?
తెలుగు జెండా లేదురా!

తెలుగు తల్లియె నేర్పింది
తీయ తేనెల భాష;
తెలుగు తల్లియె దిద్దింది
మాయ తెలియని వేషం;

తెలుగు కవనపు జ్యోతి
వెలుగు చుండే నాడు,
తెలుగు జీవన గీతి
పలుకు చుండే నాడు,

బానిసత్వము మాకు
కలదా?
పారు బోతులు మాలో
కలరా?

* * *

# బలిపీఠము

'ఆంధ్ర భాషా మతల్లి' హృదంతరమున
అడుగులను మోపి, ఠీవిగా నడచి నీవె
'ఆంగ్ల విద్యాలయమ్ము'ల కరగి — నీదు
జీవితమ్మె నైవేద్యమ్ము చేసినావు.

చదివితి వాంగ్ల శాస్త్రములు;
సార మెరింగితి వంతె కాని, నీ
చదువు ఫలమ్ము కాంచక,
ప్రశాంతి నెఱుంగని కర్కశాధ్వమున్
బ్రదు కరచేత దాల్చి, నడువన్
గతి యేమిటో? దేశభక్తితో
చదువగ రాదె నీ తెలుగు
సంస్కృత విద్యలు జ్ఞానలబ్ధికై?

చదివిన జీవయాత్రి కొనసాగు
నటంచు తలంచి? వెఱ్ఱివై
చదివిన "ఆంగ్ల విద్యయె" పిశాచ
విధమ్మున తాండవించె నీ
హృదయ దరిద్రి భూమి; బ్రతికింపదు
చంపదు — మొండి దయ్య మి
ట్టిది తగినట్టిదే — అనుభవింపుము
'బానిస మాంధ్రిరాష్ట్రిముౕ'

అది 'బలిపీఠ' మం చెరుగ వైతివి;
గోత్రాల మేకపోతులౕ
తుది యొనరించి, రక్తములతో
తులదూగ దటంచు, మూర్ఖవై
గదియగ బోయినాడవుగ; గల్గునె శాంతము?
మొండి కత్తితో
గదియగ రారె యెల్లకును,
కంఠము తుంచగ? పాతకోత్తమా!

రక్తము నీల్చి వైచి, అబలత్వము
పెంపొనరించి, సృష్టిపై
రక్తి నశింప జేసి, చపలత్వ
మహత్త్వము వృద్ధి జేసి, నీ
శక్తుల రూపుమాపి, తిన శక్తు
లడంచెడు నేటివిద్యలన్
భుక్తికి నేర్పుచుండె ? మన పుట్టువు
లిట్టుల వ్యర్థ మొందగన్.

ప్రకృతి కళాభిమానమున
పర్యవసింపగ నీదు మానసం
బకలుష లాలితోజ్జ్వల సముంచిత
మంజు మరంద ధారలన్
ప్రకటన నేయు పుష్ప మధు లాలన
కోమల సుందర ద్యుతుల్
వికల మొనర్ప నెంచవె?
నవీన కళాభి నివేశముల్ సఖా!

కలధన మెల్ల బెట్టి చెడుగా!
అధునాతన విద్య నేర్వగా
ఫల మెటు లబ్బునయ్య! వినువా డెవడయ్య
త్వదాత్మ ఘోషముల్ ?
వలవల యేడ్వ గుట్టఁనుచు వాసిన——
తిండికి లేక నీసుతుల్
మలమల మాడిన౯ వినెడు మానిసి
లేడని నమ్ము మాంధ్రుడా!

కదలగ శక్తి లేక తినగా
లవమేనియు భుక్తి లేక, నీ
సొద వినువాడు లేకకట!
క్రుక్కుచు, సోలుచు, వీధివీధుల౯
చెదరని పేద కోరికల జీవిత
భారము దిద్దుకొంచు, నీ
హృదయ విషాద గీతి నినదించవె
విశ్వ విపంచి కంతుల౯?

కడుపును చేత దాల్చి, కడ గన్నుల
నశ్రులు చింద, గుండియల్
దడదడ లాడ, లోని పరితాపము
మోమున తాండవింప, నీ
నడకలు మందగింప, కరుణ౯ గను
మానిసిలేక, ఏటికో
వెడలుచు నుంటి వయ్యా!
త్వద భీప్సిత సిద్ధులు నీటగల్వగా!

బ్రతుకగ నెంచ "ఆంధ్రి" దని
పల్కగ బోకుము; పల్కినంత, నీ
యతనము బుగ్గి పాలయి, ప్రియాసయె
నిల్చును మృత్యు దేవి వై;
సతతము దుఃఖ భోక్తవయి,
శాంతి నెఱుంగక, వెఱ్ఱి వాడవై
వితరణ శీలుర౯ గనగ వేడెను
కంఠము రుద్ధ మొందగా.

# కర్మ

"నేను" "మేమ"నియెడి వెఱ్ఱి నియతి చేత
అలసి సొలసిన బ్రతుకు పర్యంక మందు
హృదయ సుమ శోభ వీడి నశించి పోవ
కనుల చితి యింతె? రుధిర రేఖల కుమార!

"అంధ బధిరతా క్లీబతా వ్యాధు లెల్ల
పూర్వ కృత పాప ఫలములై పర్వుచుండ,
నూరు యజ్ఞాలు చేయు గభీరు లైన
అనుభవింపక నౌను దుఃఖార్ణవమ్ము.

మంచి చెడ్డల రెండింటి మధ్య యందు
పోవు చున్నట్టి జీవిత నావ లెల్ల
తీర మేదైన చేరునో! చేరకుండ
పర్వతము తాకి ముక్కలై పగులు నేమొ!
దైవ మెరుగును; కర్మ సూత్రమ్ము లెరుగు.

జరిగి పోయిన దేదియో జరిగి పోయె;
జరుగు చున్నది ఏదియో జరుగు చుండె;
జరుగ బోవున దిక మీద జరిగి తీరు;
మనల నేమున్న దెల్ల కర్మమ్మె గాక.

కలిమి లేములు కష్ట సుఖమ్ము లెల్ల
కర్మ దేవత కనుసన్న కదలి పోవు;
కర్మ రథమేగు త్రోవలో గడ్డి వోలె
నలిగి పోదుము మోక్షమ్ము కలుగు దనుక.

తలను వ్రాసిన మూడు పంక్తులను చెరుప
నా తరమె? నను గన్న విధాత తరమె?
అనుచు పను లెల్ల కర్మ సిద్ధాంత మందు
త్రోయ బోకుము 'స్వ కృషిని చేయ వలయు'.

△

# కూలి

గాలి వానల లోన కటికి రాళ్ళను కొట్టి
క్రుశియించి బ్రితుకంగ లేని 'కూలి'
మలమల మాడెడు మండు వేసవి లోన
బాటపై రాళ్ళను పరుచు 'కూలి'
మోయ లేని బరువు మోసియు బిడ్డల
పెంచగా లే కేడ్చు పేద 'కూలి'
ఇల్లు వాకిలి లేక అల్లాడి పోవుచు
చెట్టు చేమల నీడ జేరు 'కూలి'

తిరుగు చున్నాడు చైతన్య తేజ మెల్ల
అదు గడుగు నందు నశియించి అస్తమింప -
సాంఘి కాభి వృద్ధి చెరచు జాడ్య మైన
ధన మదాంధుని గర్వమ్ము తగ్గ దేమొ !

కోటి దేవుళ్ళు తలదాప గుళ్ళు కట్టి,
దేశ సౌభాగ్య భోగమ్ము తేట పరుప
కలిమి గల వారి సౌధాలు కట్టు వాని
భార్య బిడ్డలు నిలువంగ పంచ లేదె ?

* * * *

ఇటికలను జేసి కూలీల యెముక లెల్ల
వేడి నెత్తుటి సున్నంపు మేడ కట్టి,
చేరు చున్నావె ధనికుడా! జారు దేమొ
అడుగు జాగ్రత్త! తల పైన పిడుగు వడునో!

బ్రతుకు లేని కూలీల పై బండ మోపి,
బండ పై నిల్చి నీ పాడి పంట లెల్ల
కనుల పండువ గొల్పగా గాంచు చుంటె
కోటి రతనాల మిడినాగు ఆట లాడ!

గుండెపై బడ్డ కొండలు పిండి గాగ,
గొంతు లోయలో మృత్యువు గొణుగు కొనగ,
అడు గడుగున నిరాశ యే ఆవులింప,
కదలు చున్నాడు నీడగా కటికి పేద.

ఎడద ' ఆకలి ' మిడినాగు పడగ విప్పి
బుసలు కొట్టుచు నుండెను కసరి కసరి,
విషము గుండెను తట్టిన వేళ లందు
కనుల ప్రాణాలు వానికి కదిలి పోవు.

వాని నెత్తుట నూకలు నాన పెట్టి
కాసులను జేయు ధనికుల గాచు నేమొ
'దీనజన రక్షకుండ' ను దేవుడెపుడు !
కాని వానిని కన్నెత్తి గాంచ బోడు.

అన్న పూర్ణమ్మ చేతిలో నతని బ్రతుకె
పాత్ర యైనను భిక్షమ్ము బడయ లేదు ;
కాని - గోర్వెచ్చ గన్నీటి గాంగ ఝురిని
పూర్తి యైనది ఆ పాత్ర ; పోయె నామె.

వాని యెడదలో పాడైన వీణ కలదు,
లేవు తీగలు, రాగాలు రావు పలుక,
శ్రుతులు చెదరెను, తీయని గతులు మారె ;
అట్టి 'మృత వీణ' చితి పైన పెట్ట రాదె ?

వాని పరిదగ్ధ జీవిత భాజనముగ
రుధిర హారతి వెలుగు ; రుద్రుడు నటించ
ఆరి పోవును హారతి ; ఆరి పోదు
కడుపు లో మండు 'ఆకలి' పిడుగు మంట !

కారు చున్నట్టి కన్నీటి కాల్వ యందు
కటిక చీకటి చిరునవ్వు కలసి పోయె;
నీలి మబ్బుల కాటుక నీడలందు
మెరుపు కన్నియ చిరునవ్వు కరిగి పోయె.

శీత కాలంపు చలిగాలి కోత కోయ
కడుపు లోపల చేతులు కాళ్లు పెట్టి,
వణకి పోవు చుండు ముసలి వాని విధము;
కప్పుకొన పాత బట్టయు గాంచ బోడు.

లేదు కన్నీట వానికి లేమి, సుంత
రాదు లక్ష్మి కటాక్షానురాగ లవము,
పోదు జీవమ్ము ఎముకల బొంత విడచి;
వాని కంటెను బాధ లెవ్వండు పొందు?

# ఆకలి

ఆకలంటూ,
అన్నమంటూ,
కేక లేసే,
కూలివానికి —

అన్నపూర్ణా హస్తమందున
అన్న ముంటే లాభ మెంతో,
సున్న మున్నా లాభమంతే;
ఆకలీ!
మందు
టాకలీ!

* * *

మింటి కంటెడు
కడుపు మంటను,
ఆర్ప లేనీ
కంటి నీటికి—

దీన జన రక్షకుండను
దేవు డుంటే లాభ మెంతో,
దెయ్య మున్నా లాభ మంతే;
ఆకలీ!
మందు
టాకలీ!

* * *

కాల వాహిని
        గర్భమందూ,
కలసి పోయే
        కటికి పేదకు—

ప్రజల గావగ పుట్టి నారను
రాజు లుంటే లాభ మెంతో
రాళ్ళ గుట్టల లాభ మంతే;
    ఆకలీ !
    మందు
    టాకలీ !

* * *

జీవితాశలు
జీర్ణమైనా,
గుండె కమిలీ
మండి పోయిన—
పల్లె లందూ
అగ్ని నాగులు,
పడగ లెత్తీ
ఆడ కుండునే;
ఆకలీ!
మందు
టాకలీ!
* * *
వదల జాలని
పేద రైతుల
కంటి కాలువ
మట్టి కలసిన—
ఆది శేషుని
వేయి శిరముల
అగ్ని వీణాలు
భగ్గు మనవే;
ఆకలీ!
మందు
టాకలీ!
* * *

చావు బ్రతుకుల
    సంధి యుగమున,
దరిద్ర జీవులు
    దగ్ధ మైనా—

కాలు కాష్టపు
    మంట తోనే
కాటి రేనీ
    కనులు మండవే;

ఆకలీ !
మండు
టాకలీ !

* * *

# మా రవి కవి

"దేశ భాషల యందున తెలుగు లెస్స"
అనెడు శ్రీకృష్ణ రాయల అమృత సూక్తి.

"తేనె లొలికించు తీయని తెనుగు భాష"
అను రవీంద్ర కవీంద్రు విజ్ఞాన బోధ
చెరగ కుండగ ఎడదలో కురియు సుధలు.

*　　*　　*

అకట! 'మా రవి' కస్తమయమ్ము కలదె?
రవికి జర లేదు; మృతి లేదు; పవలు రేల
తేజ మొలికించు జ్ఞాన ప్రదీప్తు డతడు;
అతడు లేకున్న సృష్టియే అస్తమించు.

*　　*　　*

శ్యామల మేఘ వేష్టిత దిశా వలయమ్మగు
　　కారు చీకటిన్
ఏమని వ్రాయు నాకల మికెట్టుల
　　మీటు విపంచి బ్రాహ్మి; పూ
దామము భిన్నమై చన
　　సుధాలపన మ్మగు ముళ్ళ బాటపై
నేమని కాలు మోపి చన నెంతును?
　　శారద మాతృ పూజకై.

కనులు తెరచిన, మూసిన కానుపించు
మధుర మోహన మూర్తి! నమస్సు లివిగో!
లోతు గుండెలో వెన్నెల పూత పూయు
మంగళా శంసి కొనుము నమస్సు లివిగో.

* * *

కోకిల పాటలో కులుకు తేనెల పైన
పూ రేకు పడవపై పోయినాడు;
శారద వీణతో చవు లూరు స్వరముతో,
తీయని రాగాలు తీసినాడు;
అళిరాజు గీతితో వలరాజు మామతో
వలపు సయ్యాటలు సలిపినాడు;
కవికుల గురువైన కాళిదాసునితోడ
తులతూగు కవి యని చెలగినాడు;

"భావకవి సార్వభౌమ" సద్భాగ్య మొందు
మా "రవీంద్ర కవీంద్రు"ని మనసు నిలపి
కానుక గా నిత్తు గోర్వెచ్చ కంటి చుక్క;
హారతి నిడెదు మందు నా యాత్మ నేడు!

పాడునే 'కోకిల' భావగీతమ్ముల
రాళ్ళు తమంత కరగి స్రవింప ?
ఆడునే 'నెమలి' దివ్యాంగనా నృత్యమ్ము
శ్యామలాంబుద పంక్తి చవులు గొలుప ?
వీడునే 'పుష్పమ్ము' విమల సౌరభముల
దిగ్దిగంతముల సందేశ మంప !
వేడునే 'మధుపమ్ము' వేడి పూదేనెల
మధు లతాంతమ్ముల మనసు నిలుప ?

సరస సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి
మా "రవీంద్ర కవీంద్రుడే" మాయ మొంద,
ప్రకృతి సహజ ధర్మములు వీడ్వడి, జగంబు
మారి మసగిన నగరంబు తీరు గాదె ?



# మహా గాంధీజీ

తలచు కొన్నట్టి భావాలె పలుకు చుండు,
పలికి నట్టులె కార్యాలు సలుపు చుండు;
'మనసు - మాటయు - చేతయు' మధుర ఫణితి
ఏకమొనరించు 'మహా గాంధి' కెవడు సాటి?

బ్రతుక లేదయ్య బానిస బ్రతు కతండు
గాంచ లేదయ్య మనతల్లి కంటి నీరు;
పేద సాదల నెల్లర బిడ్డ లటుల——
కడుపులో దాచి రక్షించు కన్నతండ్రి
గాంధి దేవుని బోల డొక్కండు కూడ.

కడుపు మంటచే కన్నీరు కార్చు వాని
గాంచి నంతనే హృదయమ్ము కమిలి పోవ,
జోలి చేపట్టి, ఇంటింట కేలు చాచి,
బిచ్చ మెత్తెడే 'మహా గాంధి' పేదకొరకు.

ధర్మసూత్రము రాట్న సూత్రమ్ము గాగ
పసిడి వసనమ్ము ఖద్దరు బట్ట గాగ
మరణ హోమమ్ము శాంతి సమరము గాగ
మార్చి లోకాని కొకనీతి కూర్చినాడు!

చింత చివుకులు లేనట్టి చెట్టు నీడ
జ్ఞాన దీపిక చేంత, విజ్ఞాన మొసగు
'గీత' చదువుచు - చదివిన నీతులెల్ల
కార్యరూపాన జూపు మా గాంధి తాత.

ఆ బోసి నవ్వులో — అస్తమించును
దేశదారిద్ర్య తిమిర సంతాన పటలి,
ఆ వెఱ్ఱి చూపులో — అవతరించును
భవ్య సౌఖ్యోన్నతంపు విశ్రాంత మధువు,
ఆ మితభాషలో — అవఘళించును
జాహ్నవీ పయఃపూర గంభీరరవము,
ఆ ఫాలభాగాన — అలముకొన్నది
దిగ్దిగంత యశో విజయార్ద్ర రేఖ,

అతడు — అడుగు మోపినచోట, అమృత మొలుకు;
అతని గాలి వీచినచోట మతులు కుదురు
అతడు సాక్షాత్తు శాంత బుద్ధావతారు,
డంచు తెలియుమో తండ్రి! విజ్ఞాన బుద్ధి.

పాడి పంటలు శోభిల్లు పల్లె లన్న
పంచ ప్రాణాలు మా గాంధి వదలివైచు;
పెరుగు చిల్కెడి పడతుల నరసి నంత
ముక్తి గొన్నట్టి భక్తుడై మురిసిపోవు.

వేద వేదాంగముల్ విప్పిచెప్పెడి నాటి
వ్యాస విజ్ఞాన దివ్యామృతమ్ము
ఉపనిషత్ గోదుగ్ధ మొగి త్రావ నిచ్చిన
శంకరాచార్య ప్రశాంత రేఖ
మ్లేచ్ఛ కరుల నెల్ల విచ్ఛిన్న మొనరించు
శ్రీ శివాజీ దివ్యసిత యశస్సు
సంగీత సాహిత్య సత్కళలను నిల్పు
'కృష్ణరాయల' లసత్ కీర్తి మహిమ

లెల్ల నేకోన్ముఖమ్ము - ఘనీభవించి
'గాంధి మాహాత్మ్య' రూపమ్ము గాంచగలిగె;
తల్లి ! హిందూ మహాలక్ష్మి ! దాల్చు మమ్మ
చెరిగి పోవని కుంకుమ చెలిమిబొట్టు.



# జయభేరి

౧

'వాల్మీకి' వాక్కులో
వర్ధిల్లు ఛందస్సు,
'కాళిదాస' కవనాన
గాంగ నిర్ఝరి ధాటి,
'త్యాగయ్య' గీతాల
తంటి తేనెల తీపి,
'క్షేత్రయ్య' పదములో
చిలుక కస్తురి తావి;

౨

విశ్వగళమున మ్రోగ
వినిపించు 'జయభేరి'

భావి భారత నేత!
భాగ్య జీవన దాత!
వెలిగించు నవజ్యోతి;
పలికించు జయగీతి.

* * *

౧

'రామ రాయల' కన్ను
రగిలించు శౌర్యమ్ము,
'కృష్ణ రాయల' కత్తి
కెరలించు రక్తమ్ము,
'గాంధి దేవుని' సూక్తి
కరగించు హృదయమ్ము,
'బుద్ధి దేవుని' బోధ
పొలపించు జ్ఞానమ్ము;

౨

విశ్వ వీధులలోన
వెదికినా కనలేవు -

భావి భారత నేత!
భాగ్య జీవన దాత!
వెలిగించు నవజ్యోతి;
పలికించు జయగీతి.

* * *

'భవభూతి' కవిరీతి
పలికించు మధురమ్ము,
'శ్రీనాథ' కవి భాతి
చిత్రించి ప్రణయమ్ము,
'జయదేవ' కవి గీతి
స్మరియించు స్వర్గమ్ము,
'రవిదేవ' కవి నీతి
ప్రకటించు ప్రణవమ్ము;

విశ్వ వీణియ మీట
వినిపించు మృదురీతి—

భావి భారత నేత!
భాగ్య జీవన దాత!
వెలిగించు నవజ్యోతి;
పలికించు జయగీతి.

* * *

జెయ్ జెయ్, జెయ్ జెయ్
"ఆంధ్రమాత"!
జెయ్ జెయ్, జెయ్ జెయ్
"యశోవిజాత"!

భారత దేశాకాశ విరాజిత
చంద్రకళా కళాశోభిత ॥జెయ్॥

ధీర కుమార గభీర హృదయ
రుధిర లిఖిత పదభరితా ॥జెయ్॥

గౌతమి కృష్ణోత్తుంగ తరంగ
మంగళ గానోల్లాస సేవితా ॥జెయ్॥

జెయ్ జెయ్, జెయ్ జెయ్
"ఆంధ్రమాత"!

∆